# ముక్తి మౌక్తికాలు

(తెలుగు తాత్పర్యంతో)

Acc No: 30975 392/393

సంకలనం :

రాణి పాలకోడేటి

ప్రధాన సంపాదకులు :

ఆనందఘన

డా. అరిపిరాల విశ్వం

పరంపర విశ్వంభర

# MUKTHI MOUKTHIKALU

SANSCRIT SLOKAS IN TELUGU SCRIPT

COMPILATION AND
TELUGU TRANSLATION : RANI PALAKODETI, MA

PRINTED AT : CAXTON PRINTERS, HYD.

COPIES : 500 A CC No. 30975

PRICE : RS. 1.00

PUBLISHED BY : SRI VENKATRAGHAVA PUBLICATIONS,
PT. 27, OFFICERS COLONY,
PUNJAGUTTA, HYDERABAD-500 482.

FOR COPIES : PARAMPARA VISWAMBHARA
3-4-415-2, TOP FLOOR,
STREET NO. 4, HIMAYATH NAGAR,
HYDERABAD-500 029

JULY, 1993



392/393

కృతే సేనాధిపతి స్కంద :
త్రేతాయాంతు కుమారక :
ద్వాపరే సుబ్రహ్మణ్యంతు
కలౌ వేంకట నాయక :

శ్రీ వల్లి దేవసేనా సమేత
సుబ్రహ్మణ్యస్వామి
పాదపద్మాలకు –

– రాణి పాలకోడేటి



రాణి పాలకోడేటి

| | | |
|---|---|---|
| జననం | : | 1964 ఆగస్టు 25 |
| తల్లి | : | సరోజినీదేవి |
| తండ్రి | : | భండారు పర్వతాలరావు |
| విద్య | : | సెయింట్ ఫ్రాన్సిస్ కాలేజీలో బి.ఎ.<br>మద్రాసు విశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఎ. |
| వ్యాపకం | : | అబ్జర్వర్ లండన్ పత్రికకు విలేఖరిగా,<br>సూర్య ఇండియా పత్రికకు విలేఖరిగా,<br>ప్రస్తుతం భారత పురావస్తు శాఖలో ఉద్యోగం. |
| వివాహం | : | 1987 జూన్ 3 |
| భర్త | : | పాలకోడేటి బలరాం |
| కుమార్తెలు | : | స్వర్ణ, అపర్ణ |
| అభిరుచులు | : | సాహితీ వ్యాసంగం, జర్నలిజం |

అపవిత్రః పవిత్రో వా
సర్వావస్థాం గతోపివా
యస్స్మరేత్ పుండరీకాక్షం
సబాహ్యాభ్యంతర శ్శుచిః

స్నానము చేసిన వారయినా, చేయక పోయిననూ, ఏవిధంగా, ఎక్కడ వున్నప్పటికీ, భగవంతుని తలచుకొన్నట్లయితే, బయట (దైహికంగా), లోపల (మానసికంగా) శుచి అవుతారు.

నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వ మవ్యయం

నారాయణుని పాద పద్మాలకు నమస్కరిస్తున్నాను, ఎల్లప్పుడూ నారాయణుని పూజిస్తాను, నిర్మలమైన నారాయణ నామాన్ని పలుకుతుంటాను.. అవ్యయమయిన నారాయణుని తత్వాన్ని తలచుకొంటాను.

– లోమహర్షణ మహర్షి

మజ్జన్మనః ఫలమిదం
మధుకైటభారే
మత్ ప్రార్థనీయ
మదనుగ్రహ ఏషయేవ
త్వద్భృత్యభృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య
ఇతిమాం స్మర లోకనాథ

లోకనాథా!

మధు, కైటభులను చంపిన ఓ మహా విష్ణూ! నా ప్రార్థన ఒక్కటే వుంది. దానిని నీవు అంగీకరించు. అదేమిటంటే, నీ బంటు యొక్క బంటు యొక్క బంటుయొక్క బంటుయొక్క బంటుగా (దాసాన దాసునిగా) నీవు నన్ను మన్నిస్తే నా జన్మసఫలం అయినట్లే.

– కృపాచార్యులు (పాండవ గీతలలో)

"అహం ప్రపన్నోస్మి
    పదాంబుజం ప్రభో!
భవాప వర్గాం
    తరయోగి భావితం
యథాంజసా జ్ఞాన
    మపార వారిధీం
సుఖం తరిష్యామి
    తథాను శాధిమాం"

ఓ ప్రభో! నీ పాద పద్మాలను పొందాను. నా అజ్ఞానం పోగొట్టు, నా పాపాలను నాశనం చేయి. నన్ను తరింప చేయి.

– లక్ష్మణుడు (శ్రీరామ గీతలో)

శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసేతి
ఆలాపనం ప్రతిపదం కురుమే ముకుంద!

శ్రీ వల్లభా, వరదా, దయాపరా, భక్తప్రియా, భవలుంఠన కోవిదా, (పాపాలను పోగొట్టటం బాగా తెలిసిన వాడా), నాథా, నాగశయనా, జగన్నివాసా! ముకుందా! మాట మాటకు నిన్ను తలచుకునేలా చేయి.

మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిం
యత్ కృపా తమహం వందే
పరమానంద మాధవం

ఓ మాధవా! పరమానందా! నీ దయవలన అజ్ఞాని జ్ఞాని కాగలడు. మూగవాళ్లు చక్కగా మాట్లాడ గలుగుతారు, కుంటివాళ్లు కొండలే దూక గలుగుతారు.

బ్రహ్మ చిద్బ్రహ్మ భువనం
బ్రహ్మ భూతపరంపరా
బ్రహ్మాహం బ్రహ్మ మచ్ఛత్రు
ర్బ్రహ్మ మన్మిత్ర బాంధవా

చిత్ పదార్థం బ్రహ్మం
లోకం అంతా బ్రహ్మం
జీవులంతా బ్రహ్మం
నేను బ్రహ్మం, నా శత్రువూ
బ్రహ్మం, నా మిత్రులు
బ్రహ్మం, నా బంధువులు
బ్రహ్మం

ఏతద్ధేవాక్షరం బ్రహ్మ
ఏతద్ధేవాక్షరం పరం
ఏతద్ధేవాక్షరం జ్ఞాత్వా
యోయదిచ్ఛతి తస్యతత్

ఆ ఓంకారమే బ్రహ్మము
ఆ ఓంకారమే పరమ పదము
ఓంకారాన్ని తెలిసికొని ఎవరు ఏది కోరుదురో వారికి అది వాటిని యీయగలదు.

— కఠోపనిషత్తు

హరేర్నామైవ నామైవ
నామైవ మమ జీవనం
కలౌ నాస్త్యేవ
నాస్త్యేవ గతిరన్యథా

నాకు హరినామమే జీవనం. కలియుగమందు మరొక మార్గం లేదు.
– విదురుడు (పాండవగీత)

యత్రవా తత్రవా దేవ
యది విశ్వసినస్త్వయి
నిర్వాణ మపి దుర్వార
మర్వాచీనాం కింపునః

*కృష్ణా! నిన్ను నమ్ముకున్న వారికి మోక్షమే లభిస్తూ వుండగా మిగిలినవి రావటంలో ఆశ్చర్యం ఏముంటుంది?*
– లీలాశుకులు (కృష్ణ కర్ణామృతం)

యద్దినం హరి సల్లాప
కథా పీయూష వర్జితం
తద్దినం దుర్దినం మన్యే
మేఘచ్ఛన్నం న దుర్దినం

మబ్బు పట్టి సూర్యుడు కనిపించని రోజును దుర్దినమని అంటారు. కాని నిజంగా అది దుర్దినం కాదు. ఏ రోజు హరి కథామృతం వినే భాగ్యం కల్గదో ఆ రోజే యథార్థానికి దుర్దినం.

– నిర్‌బుతి (పాండవ గీతలు)

మయిప్రసాదం మధురైః కటాక్షైః
వంశీ వినాదాను చరైర్విదేహి
త్వయిప్రసన్నే కిమిహాపరైర్నః
త్వయ్యప్రసన్నే కిమిహాపరైర్నః

కృష్ణా! నన్ను కటాక్షించు. నీ దయ వుంటే నాకు మరేది లేకున్నా ఏం కాదు. నీ దయ లేకుంటే నాకెన్ని వున్నా ఏం లాభం?

– లీలాశుకులు (కృష్ణకర్ణామృతం)

పరమాత్మ ప్రపత్తి
సహస్ర శీర్షం పురుషం పురాణం
అనాది మధ్యాంత మనంత కీర్తిం
శుక్రస్య ధాతార మజంచ నిత్యం
పరం పరేషాం శరణం ప్రపద్యే

పరమాత్మ అనేక తలలు (రూపాలు) కలవాడు.. పురాణ స్వరూపుడు, ఆయనకు మొదలు, మధ్య, చివర అని లేదు. ఆయన కీర్తి అనంతం. అందరికీ శక్తినిచ్చేది ఆయనే, ఆయనకు పుట్టుక లేదు, చావు లేదు. పరమపిత అయిన పరమాత్మను శరణు పొందుతున్నాను.

– అర్జునుడు (గీతలో)

యస్య స్మరణ మాత్రేణ
జన్మ సంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై
విష్ణవే ప్రభవిష్ణవే

తలచిన మాత్రంతోనే నీ నామం సంసార బంధాల నుండి విముక్తం చేస్తుంది. అట్టి మహావిష్ణూ! నమస్కారం.

కిం అస్థిమాలాం కిం కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్య సేత్వం
కిం కాల కూటః కిమువాయశోదా
స్తన్యం తవస్వాదువద ప్రభోమే

నీవు ధరించింది ఎముకల దండా, కౌస్తుభమా? త్రాగింది యశోదా దేవి చనుబాలా, కాలకూటమా? హరి హర రూపా! నీకేది రుచో, చెప్పు!

— తిక్కన సోమయాజి

నాస్తి నాస్తి మహా భాగ
కలికాల సమం యుగం
స్మరణాత్ కీర్తనా దేవ
సంప్రాప్నోతి పరాంగతి

కలియుగం వంటి యుగం లేదు. దేవుని నామాన్ని తలుచుకుంటేనే ముక్తి లభిస్తున్నది.

— సనత్కుమారులు

విపరీతేషు కాలేషు
పరిత్యక్తేషు బంధుషు
త్రాహిమాం కృపయా కృష్ణ
శరణాగత వత్సల!

కాలం అనుకూలంగా లేని సమయంలో బంధువులు వదిలివేస్తారు. (మరణ కాలంలోనూ, అంతే) అటువంటి సమయంలో శరణు అన్నవారిని కాపాడే కృష్ణా! నీవే దయతో నన్ను రక్షించు.

— భీష్ముడు (పాండవ గీతలలో)

క్షణం చిత్తం క్షణం విత్తం
క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా నాస్తి
ధర్మస్య త్వరితాగతి

దానం యిద్దామనుకుంటే ఆలస్యం లేకుండా వెంటనే ధర్మం చేయాలి. ఎందుకంటే మన మనస్సు చంచలం, మారిపోవచ్చు; డబ్బు చేజారి పోవచ్చు; యముడికి దయలేదు— ఎప్పుడు ప్రాణాలను తీసుకుపోతాడో తెలియదు కనుక చేయదలచిన దానం వెంటనే చేయాలి.

— కర్ణుడు

దేహీతి వచనం కష్టం
నాస్తీతి వచనం తధా
దేహి నా స్తీతి మద్వాక్యం
మా భూజ్జన్మని జన్మని

కృష్ణా! ఒకరిని చేయి చాచి 'దేహి' అని యాచన చేయడం కష్టం, అలాగే నోరు తెరచి అడిగిన వానికి లేదు అని చెప్పడం కష్టమే. నాకు జన్మ జన్మలకూ ఈ రెండు కష్టాలు కలుగకుండా అనుగ్రహించు.

– కర్ణుడు

కేదారే హ్యుదకం పీత్వా
వారణస్యాం మృతస్తథా
శ్రీశైలే శిఖరం దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే

కేదారంలో తీర్థం పానం చేసినా, కాశిలో మృతి చెందినా, శ్రీశైల శిఖరం చూసినా మళ్ళీ జన్మ కలుగదు.

నజాతు కామః కామానా
ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణ వర్త్మేవ
భూయఏవాభి వర్ధతే

కామము కామానుభవం చేత తృప్తి పొందదు. కట్టెలు వేసిన కొద్దీ మంట చల్లారుతుందా?

— మనువు

సాధూనాం దర్శనం పుణ్యం
స్పర్శనం పాప నాశనం
సంభాషణం కోటి తీర్థం
వందనం మోక్ష సాధనం

సాధువులను చూడటం వల్ల పుణ్యం కలుగుతుంది. వారిని ముట్టుకోడం వల్ల పాపం పోతుంది. వారితో మాట్లాడితే కోటి తీర్థాలలో మునిగినంత పుణ్యం. వారికి నమస్కరించటం ముక్తికి మార్గం.

అగ్నిర్దేవో ద్విజాతీనాం
మునీనాం హృదిదైవతం
ప్రతిమా స్వల్ప బుద్ధీనాం
సర్వత్ర సమదర్శినః

ద్విజులకు అగ్నియే దైవము, మునులకు మనస్సు నందే దైవము.. అల్పబుద్ధి గల వారలకు విగ్రహాలు, ప్రతిమలు దేవుళ్లు. ఆత్మ సాక్షాత్కారం పొందిన తత్వవేత్తకు అంతటా దైవమే..

— ఉత్తర గీత

అనిత్యాని శరీరాణి
విభవోనైవ శాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః
కర్తవ్యో ధర్మ సంగ్రహః

శరీరమా నిలువదు, సంపదలు శాశ్వతం కావు, చావు ఎప్పుడు వెన్నంటే వుంటుంది. అందువల్ల ధర్మాన్ని ఆచరించడమే చేయదగిన పని.

కృతే యద్ధ్యాయతో ముక్తిః
త్రేతాయాం యజతో మఖైః
ద్వాపరే పరిచర్యాయాం
కలౌతత్ నామకీర్తనాత్

ముక్తి కోసం కృతయుగంలో కఠోరమయిన తపస్సు చేయవలసి వుండేది. త్రేతాయుగంలో యజ్ఞాలు చేయవలసి వచ్చేది. ద్వాపరంలో శుశ్రూష చేయవలసి వుండేది. కలియుగంలో నామ కీర్తనం చాలు!

– భాగవతం

మద్భక్తః శంకర ద్వేషీ
మద్వేషీ శంకర ప్రియః
తావు భౌ నరకం యాతో
యావచ్చంద్ర దివాకరం

నా భక్తుడైవుండి శివుడంటే పడనివాడు, శివభక్తుడై వుండి నన్ను ద్వేషించేవాడు సూర్యుడు, చంద్రుడు వుండేంత వరకు నరకంలో పడి మగ్గుతాడు. (శివునికీ, విష్ణువుకూ మధ్య తేడా చూడటం పాపం)

– విష్ణువు (విష్ణుపురాణం)

కర్తృత్వ భోక్తృత్వ
ఖలత్వ మత్తతా
జడత్వ బద్ధత్వ
విముక్తితాదయః
బుద్ధేర్వి కల్పానతు సంతి వస్తుతః
స్వస్మిన్ పరే బ్రహ్మణి కేవలేద్వయే

పని చేసేది, తినేది, నశించేది, మదించి వుండేది, మందమతిగా వుండేది, కట్టుబడి వుండేది, విముక్తి పొందేది– యిటువంటి పనులన్నీ బుద్ధి యందు కలిగే వికల్పాలే కాని అసలు వస్తువయిన ఆత్మనంటవు. ఆత్మ స్వరూపమయిన పరబ్రహ్మం కేవలం ఒక్కటే.

నకాల నియమో యత్ర
నదేశస్య స్థలస్యచ
యత్రాస్య రమతే చిత్తం
తత్ర ధ్యానేన కేవలం

ఈ రోజు తిథి మంచిదా కాదా, వర్జం వుందా అని కాల నియమం చూచుకోనక్కరలేదు..
దేశం కాని, స్థలం కాని సరిగా వున్నాయా లేవా అని చూచుకోనక్కరలేదు ఎప్పుడు దేవుని స్మరించాలని మనస్సుకు అనిపిస్తే అప్పుడే భగవధ్యానం చేసుకోవచ్చు.

— శివగీత

పుత్ర మిత్ర కళత్రాది
సుఖం జన్మని జన్మని
మర్త్యత్వం పురుషత్వంచ
వివేకశ్చన లభ్యతే.

పుత్రులు, మిత్రులు, భార్య, సంసారసుఖం మొదలయినవి మానవులకే కాదు జంతువులకూ వుంటాయి. మనుష్యజన్మ రావడం, అందులోను పురుషుడుగా జన్మించడం లభించినపుడు, ఆత్మ విచారం చేసి తరించాలి అనే వివేకం మానవ జన్మ ఎత్తినందుకు మనం సంపాదించుకోవాలి. (లేకపోతే జంతువుతో సమానం అవుతాం) ఆ వివేకం ఎలా లభిస్తుంది?

— శంకరాచార్యులు (సర్వసిద్ధాంత సంగ్రహం)

వేదాం త్యాగాశ్చ యజ్ఞాశ్చ
నియమాశ్చ తపాంసిచ
న విప్ర దుష్టభావస్య
సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్

వేదాలు వల్లెవేసినా, యజ్ఞాలు చేసినా, నియమాలు పాటించినా, తపాలు చేసినా మోక్షం ఎలా దొరుకుతుంది?

జ్ఞాతస్యహి ధృవోమృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాద పరిహార్యేర్థే
నత్వం శోచితుమర్హసి

పుట్టిన వారికి చావు తప్పదు. చనిపోయినవారు తిరిగి పుట్టక మానరు. తప్పించుకోడానికి వీలులేని దానిని గురించి విచారపడటం తగదు.

– కృష్ణుడు (భగవద్గీతలో)

నృజన్మజంతో రతిదుర్లభం విదుః
తతోపి పుంస్త్వంచ తతోవివేకః
లబ్ధ్వా తదేతత్త్రియం మహాత్మా
యతేత ముక్తై సహసా విరక్తః

మనుష్య జన్మ – అందులోను పురుష జన్మ దొరకదు. దొరికినా వివేకం లభించటం కష్టం. ఈ మూడూ దొరికిన మహాత్ములు శీఘ్రంగా వైరాగ్యం తెచ్చుకొని ముక్తికోసం ప్రయత్నం చేయాలి.

– సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహం

ఏకః ప్రజాయతే జంతు
రేక ఏవ ప్రలీయతే
ఏకోనుభుంక్తే సుకృత
మేక ఏవచ దుష్కృతం

పుట్టే సమయంలో ప్రాణి ఒంటరిగానే జన్మిస్తున్నాడు. చనిపోయేటప్పుడూ ఒక్కడే పోతున్నాడు. తాను చేసుకున్న మంచి, చెడు పనుల ఫలితాన్ని కూడా తానే ఒంటరిగా అనుభవిస్తున్నాడు.

కేచిద్వదంతి ధనహీన జనో జఘన్యః
కేచిద్వదంతి కులహీనజనో జఘన్యః
వ్యాసోవదత్యఖిల వేదవిశేష విజ్ఞో
నారాయణస్మరణ హీన జనో జఘన్యః

ధనం లేని వాడిని అల్పుడు అనుకుంటారు కొందరు. ఉత్తమ కులంలో పుట్టకపోతే అల్పుడనుకొంటారు మరికొందరు. కాని అన్ని వేదాలు తెలిసిన వ్యాసుల వారు భగవంతుని స్మరించని వాడే అల్పుడని పలుకుతున్నారు.

రామచంద్ర చరణారవిందయో
రంతరంగ చర భృంగ లీలయా
తత్రసన్తి రసాశ్చతుర్విధా
మాకరంద రస ఏవ పంకజే

తామర పువ్వులో తేనె మాత్రమే వుంటుంది. శ్రీ రామచంద్రుని పాదపద్మాలలో ధర్మం, అర్థం, కామం, మోక్షం – అని నాలుగు రకాలయిన తేనెలున్నాయి. మనస్సు అను తుమ్మెదా! నీవు రామ పాద పద్మాలపై తిరుగాడు.

శ్రేయోపి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ
స్త్యాగాచ్ఛాంతి రనంతరం

యోగాభ్యాసం కన్న జ్ఞానం, జ్ఞానం కన్న ధ్యానం, ధ్యానం కన్న కర్మఫల త్యాగం ఎక్కువ. కర్మఫలత్యాగంవల్ల శాంతి (ముక్తి) లభిస్తుంది..

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోసి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం

నీవు చేయు వైదిక లౌకిక కర్మల నన్నిటిని నేనే చేయుచున్నట్లు భావించు. లేదా అన్ని కర్మల ఫలాలు నాకే అర్పించు (నాకే అర్పిస్తున్నట్లు భావించి ఆయా కర్మలు చేయి)

కామః క్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞాన రత్నాపహారేణ
తస్మాత్ జాగ్రత జాగ్రత

కామం, క్రోధం, లోభం మొదలయిన ఆరుగురు దొంగలు దేహంలో దాక్కొని వున్నారు. జ్ఞాన రత్నాలను దొంగిలించగలరు.. జాగ్రత్తగా వుండండి!

ఆశయా బధ్యతే లోకో
కర్మణా బహు చింతయా
ఆయుః క్షీణం నజానాతి
తస్మాత్ జాగ్రత జాగ్రత

లోకం ఆశ అను పాశంతో కట్టబడి వుంది. ఆశ కొద్దీ అనేక పనులు చేయడం, దానిని గురించిన విచారంతో కాలం గడిచిపోతోంది. అటు ఆయుస్సు తీరిపోతున్న సంగతి తెలిసికోడల్లేదు. జాగ్రత్త వహించు.

మాతా నాస్తి పితా నాస్తి
నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి
తస్మాత్ జాగ్రత జాగ్రత

తల్లి, తండ్రీ, బంధువులు, సోదరులు, ధనం, గృహం, ఇవన్నీ నశించేవే కాని నిత్యం కావు. మన కర్మ ఫలం మనం అనుభవించకుండ వీరెవరూ మనల్ని తప్పించలేరు. కనుక జాగ్రత్త వహించ వలసి వుంది.

జన్మ దుఃఖం జరా దుఃఖం
జాయా దుఃఖం పునః పునః
సంసార సాగరం దుఃఖం
తస్మాత్ జాగ్రత జాగ్రత

పుట్టడం, దుఃఖం, ముసలితనం దుఃఖం, మళ్లీ మళ్లీ పుడుతుండటం దుఃఖం, సంసారమే దుఃఖం కనుక (సంసారం నుండీ, జన్మ బంధాల నుండి బయట పడటం కోసం) జాగ్రత్తపడు.

క్షణం చిత్తం క్షణం విత్తం
క్షణం జీవితమావయోః
యమస్య కరుణా నాస్తి
తస్మాత్ జాగ్రత జాగ్రత

మనస్సు చంచలం; డబ్బు ఎప్పుడు పోతుందో తెలియదు. బ్రతుకే క్షణభంగురం. యమునికి దయ లేదు, ఎప్పుడు తీసుకుపోతాడో తెలియదు. (అవకాశం వున్నప్పుడు ముక్తి సంపాదించే) జాగ్రత్తలో వుండు.

ఆకాశాత్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారం
కేశవం ప్రతిగచ్ఛతి

ఆకాశం నుండి పడిన వర్షపు నీరు ఏ విధంగా చివరకు సముద్రంలో కలుస్తున్నదో, అదే విధంగా ఏ దేవుణ్ణి వుద్దేశించి నమస్కారం చేసినా అది కేశవునికే (పరమాత్మునికే) చెందుతుంది.

– పాండవ గీతలు

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

శరీరంతో కాని, యింద్రియాలతో కాని, మనస్సుతో కాని, బుద్ధితో కాని, ప్రకృతి స్వభావంగా కాని నేను ఏమేమి చేస్తున్నానో, అవన్నీ శ్రీ నారాయణునకు అర్పిస్తున్నాను.

– వసుదేవుడు (పాండవ గీతలలో)

స్వస్తిః

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహిం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినోభవంతు

ప్రజలకు శుభం కలగాలి. భూమిని రాజులు న్యాయంగా పరిపాలింతుర గాక! గోవులకు, బ్రాహ్మణులకు శుభం కలుగుగాక! లోకాలన్నీ సుఖంగా వుండుగాక!

294.53 RAN
Acc no. 30978

# CARE FOR TOMORROW
# TAKE A BUS TODAY

When you use an APSRTC bus instead of your own vehicle, you save precious fuel and money.

And the nation saves foreign exhcnage,

spent in major chunks every year on oil import

To save fuel for our children and their's we'll have to save fuel today.

## COMMUTE BY BUS
## IT'S ECONOMICAL IT'S FUUTRISTIC



**Andhra Pradesh State Road Transport Corporation**

# PEOPLE WHO MOVE PEOPLE